# శ్రీ ఉమామహేశ్వర వ్రతకల్పమ్





బాలసరస్వతీ బుక్ డిపో., కర్నూలు - మద్రాసు - 1

# శ్రీ ఉమామహేశ్వర వ్రత కల్పము






పబ్లిషర్స్

**బాలసరస్వతి బుక్‌డిపో**

ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్ కర్నూలు - 518 001

టి వెంకటేశ్వర్లు శెట్టి చేంబర్స్

నెం.4 సుంకురామ శెట్టివీధి, మద్రాసు - 600 001

సోల్ డిస్ట్రిబ్యూటర్స్

**టాగూరు పబ్లిషింగ్ హౌస్**

కాచీగూడా చౌరస్తా, హైదరాబాదు - 500 027

 **1999** [వెల : రూ. **10-00**



రామేశ్వర మహాలింగము

# పీఠిక (తొలిపలుకు)

పరమశైవ, వీరశైవ భక్తులారా!

సృష్టి-స్థితి లయములకు గారణభూతుడై చిచ్ఛక్తి సమేతుడైన యా పరశివమూర్తి మృత్యుంజయుని ముల్లోకాలవాసులు ఉపాసించి తమతమ యభీప్సితములను బడసియున్నారు. ఇందుల కాధారములుగా సమస్త వేదాగమ పురాణేతిహాసములు ఘోషించుచున్నవి. శివగీతలో ప్రథమాధ్యాయమున

శ్లో॥ కోటిజన్మార్జితైః పుణ్యైః శివే భక్తిః ప్రజాయతే।
ఇష్టాపూర్తాని కర్మాణి-తేనా ఽఽచరతి మానవః॥ (16)

అందును సులభైకసాధ్యుడు భక్తులకు గల్ప వృక్షమువంటి యా ఉమామహేశ్వరుడు భక్తులకోరికలను పూరించుటలో ప్రథమగణ్యుడు ప్రమథమాన్యుడు. అందుకే కాబోలు భోలాశంకరుడని అతని బిరుదముంది.

ప్రపంచములోని మానవులు ఉమామహేశ్వర వ్రతము నాచరించి యెందరో తరించియున్నారు. ఇందు కుదాహరణముగా నీవ్రత కథా భాగములోని భక్తుల నిట బేర్కొనదగును. సర్వకామములను ఫలింపజేయు నీ వ్రతము నాచరించి ధర్మగుప్త సురూపలను దంపతులు తమ వాంఛితములను బడసి ధన్యులైరి. ఈరీతిగానే వైశ్యశ్రేష్ఠుడగు భద్రుడు తన ఉదరశూలను బోగొట్టుకొనెను. లక్ష్మీదేవిని వైకుంఠవాసాధికారమును గోల్పోయిన విష్ణుమూర్తి ఈ వ్రతము నాచరించి మరల యథారీతిని బొందెను. మార్కండేయుఁడు మృత్యువును జయించెను. కర్ణాటక భూపాలుడు తన పుత్రమిత్రకళత్రాదులను రాజ్యమును గోల్పోయి చివరకీ వ్రతము నాచరించే మరల బడసెను. శత్రువులను పరాభవింపజేసిన వాడయ్యెను. అట్లే సీతాదేవియు ఈ యుమామహేశ్వరవ్రతము నాచరించుటచే తనే తనకు నచ్చిన వరుని శ్రీరామచంద్రుని వరించెను.

కావున శైవ-వీరశైవభక్తమాహేశ్వరు లందరు ఈ యుమామహేశ్వరవ్రతమును ప్రతియేట తప్పకుండ ఆచరించి తమ తమ యభీప్సితమును బడయుదురుగాక. ఇట్లాచరించుటవలన లోకమందు ఈతిబాధలు లేక నిరంతరము ఆయురారోగ్యభాగ్యములు గలిగి

అష్టైశ్వర్యములతో సుఖమయజీవితములు గలవారగుదురు.

ఈ కాలమున ఈ వ్రతము నాచరించువా రరుదుగా నున్నారు. గ్రంథములు లభ్యమగుటలేదు. ఈ కొరతను తీర్చుటకై తమ సొంతధనరాశిని వెచ్చించి లోకకళ్యాణకాంక్షులైన శ్రీబాలసరస్వతీ బుక్ డిపోవారు నన్ను ప్రోత్సహించి ఈ గ్రంథమునకు వ్యాఖ్యానమును వ్రాయుమని అర్థించడము వలన నేను నాలో గలిగిన ఉమామహేశ్వరుని ప్రేరణచేత వెంటనే నాకు దోచిన రీతిగా యథాశక్తి వ్రాసి ఇచ్చితిని. దోసగు లున్నచో క్షమింప మనవి.

భక్తు లెల్లరు ఈ గ్రంథమును విలిచి పవిత్రమనస్కులై యీ వ్రతము నాచరించి **తమతమ** కోరికలను బడయగలరని మాకాంక్ష. దీనిని వెంటనే దోషములు **లేకుండ** ముద్రించిన శ్రీబాలసరస్వతీ బుక్ డిపో, యజమానులకు పరమశివుడు దీర్ఘాయురారోగ్యములను సుఖసంపదలను ప్రసాదించి చిరకాలము రక్షించుగాక.

ఇట్లు

రచయిత వ్యాఖ్యానకర్త

పండిత పెద్దమఠము రాచవీరదేవర

సీనియర్ గ్రేడు 1 రిటైర్డు సంస్కృతాంధ్ర పండితులు

"తీర్థ" & M.O.L. కన్నడజాణ, హిందీభూషణ

ఇం.నెం. 3-3-139, కాచిగూడ,

హైదరాబాదు-500 027. (ఆం.ప్ర.)

## శివ మహత్త్వము

సూత ఉవాచ :-

శ్లో॥ కోటిజన్మార్జితైః పుణ్యైః శివే భక్తిః ప్రజాయతే
ఇష్టాపూర్తాని కర్మాణిఽఽ తేనా చరతి మానవః.

తా॥ కోటి జన్మలలో జేసి వంపాదించిన పుణ్యఫలమువలన మహేశ్వరునియందు భక్తి గల్గుచున్నది.

శ్లో॥ వన్యేషు యాదృశీ ప్రీతి ర్వర్తతే పరమేశితుః
ఉత్తమేష్వపి నాస్త్యేవ గ్రామజేష్వపి తాదృశీ. (౬౮)

తా॥ ఈశ్వరునికి అడవియందుండే పుష్పములయందును పత్రములందును దళాదులందును ఎంతటి యాశ యున్నదో ఊరనుండేవి మేలైనవి అయినను అంతటి ఆశ వానియందుండదు.

శ్లో॥ తం త్యక్త్వా తాదృశం దేవం య స్సేవేతా న్యదేవతాం
స హి భాగీరథీం త్యక్త్వా ।
కాంక్షతేమృగతృష్ణికామ్ (౩౦)

తా॥ అలాంటి సులభతరమైన భక్తితో ప్రసన్నుడయ్యే శంకరుని వదలి ఎవడైతే ఇతరదేవతల నారాధించునో అట్టివాఁడు నిజంగా గంగానది వదలి ఎండమావుల్లోని నీరును గోరిన వాడే యగును.

## వీరభద్రస్తుతి

శ్లో॥ నమ ఉగ్రస్వరూపాయ - నమో జిష్ణ్వాదిశత్రవే । (స్వీర)
దక్షయజ్ఞవినాశాయ - వీరభద్రాయ తే నమః ॥

## శ్రీ రేణుకాచార్య స్తుతి

శ్లో॥ జీయాత్ శ్రీరేణుకాచార్యో - శివాచార శిఖామణిః ।
యో వీరశైవసిద్ధాంతం - స్థాపయామాస భూతలే ॥

## బసవేశ్వర స్తుతి (స్వీయరచన)

శ్లో॥ శ్రీకల్యాణపురాన బిజ్జలుని మంత్రశ్రీపదం బొందియున్
రాకాచంద్రుని గాంతి మించు యశమున్ రంజిల్లగా ధారుణిన్ ।
లోకారాధ్యుడవైన శ్రీబసవ - సుశ్లోకుండవై నట్టినిన్
నాకావాసులు భక్తి-గొల్తు మదిలో నన్నేల్చి నన్నేలుమా

# శ్రీ ఉమామహేశ్వర వ్రత కల్పము

## పార్వతీ పరమేశ్వరుల ప్రార్థన

మం॥ భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవా
భద్రం పశ్యేమాక్షభి ర్యజత్రాః ।
స్థిరై రంగై స్తుష్టువాంస స్తనూభి
ర్వ్యశేమ దేవహితం యదాయుః ॥

శ్లో॥ య శ్శివో నామరూపాభ్యాం – యా దేవీ సర్వమంగళా।
తయో స్సంస్మరణా త్పుంసాం – సర్వతో జయమంగళమ్॥
స్మృతే సకలకల్యాణ – భాజనం యత్ర జాయతే
పురుష స్తమజం నిత్యం । వ్రజామి శరణం శివమ్॥
సర్వదా సర్వకార్యేషు । నాస్తి తేషా మమంగళం
యేషాం హృదిస్థో భగవా – న్మంగళాయతన శ్శివః.

## వినాయక ప్రార్థన

శ్లో॥ వాగీశాద్యాస్సుమనస । స్సర్వార్థానా ముపక్రమే
యం నత్వా కృతకృత్యా స్స్యు । స్తం నమామి గజాననమ్ ॥

## భూ శు ద్ధిః

ఓం పృథివ్యాః మేరుపృష్ఠఋషిః – సుతలం ఛందః – ఆసనే
వినియోగః – అనంతాసనాయ నమః – ప్రణవస్య పర
మేష్ఠి పరంబ్రహ్మ ఋషిః – దైవీ గాయత్రీ ఛందః – ప్రాణా
యామే వినియోగః ॥

## దేవతాది నమస్కారః

శ్రీమదుమామహేశ్వరాభ్యాం నమః - తద్వామభాగస్థితలక్ష్మీ నారాయణాభ్యాం నమః తదుత్తరభాగస్థితవాణీ హిరణ్యగర్భాభ్యాం నమః తత్పురోభాగే స్థితేభ్యః నందీశ్వరాదిప్రమథమహాగణేభ్యో నమః; శ్రీజగద్గురురేణుకాచార్యాదిపంచాచార్యేభ్యో నమః. ఇంద్రాదిదేవతాభ్యో నమః బసవేశ్వరాద్యసంఖ్యాతనూతనపురాతనభక్తమహాగణేభ్యో నమః; సర్వేభ్యో భక్తమాహేశ్వరజనేభ్యో నమః.

అయం ముహూర్త స్సుముహూర్తోఽస్తు.

## ఘంటానాదము

శ్లో॥ ఆగమార్థం తు దేవానాం । గమనార్థం తు రక్షసాం
కుర్యా ద్ఘంటారవం భక్త్యా । దేవతాహ్వాన లాంఛనమ్ ॥

## ఆచమనీయము

ఓం నమ శ్శంభవే స్వాహా.

ఓం మయోభవే చ స్వాహా.

ఓం నమ శ్శంకరాయ చ స్వాహా,

శాశ్వత-శివ-స్థాణో-భవానీపతే-భూతేశ-త్రిపురాంతక-త్రిణయన-శ్రీకంఠ-కాలాంతక-శర్వ-ఉగ్ర-భవ-భర్గ-భీమ-జగతాంనాథ-అక్షయ-శ్రీనిధే-రుద్ర-ఈశాన-మహేశ-ఈశ్వర-మహాదేవాయ నమః.

## ప్రాణాయామః

ఓం భూః - ఓం భువః - ఓగ్ం సువః - ఓం మహః - ఓం జనః - ఓం తపః - ఓగ్ం సత్యం - ఓం తత్సవితుర్వరేణ్యం - భర్గో

దేవస్య దీమహి - ధియో యో నః ప్రచోదయాత్; ఓమాపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్.

## దేశకాలాది సంకీర్తనము

ఏవంగుణవిశేషణవిశిష్టాయాం శుభతిథౌ శివశివ శంభో రాజ్ఞయా ప్రవర్త మానస్యాద్యలింగిబ్రహ్మణః ద్వితీయ పరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే - జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోర్దక్షిణదిగ్భాగే - శ్రీశైలోత్తరప్రదేశే కృష్ణా గోదావర్యోర్మధ్యదేశే శాలివాహనశకే వీరభద్రావతారే శివనక్షత్రే శివయోగే అస్మిన్ వర్తమాన వ్యావహారికచాంద్రమానప్రభవాదిషష్టిసంవత్సరాణాం మధ్యే-------------సంవత్సరే----- అయనే----- ఋతౌ----- మాసే --- పక్షే -----తిథౌ------ వాసరే శుభనక్షత్రే శుభయోగే శుభకరణే ఏవంగుణ విశేషణవిశిష్టాయాం శుభతిథౌ అస్మాకం సహకుటుంబానాం క్షేమస్థైర్య విజయారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం ధర్మార్థ కామమోక్షచతుర్విధ పురుషార్థ ఫల సిద్ధ్యర్థం యావచ్ఛక్తి ధ్యానా వాహనాది షోడశోపచారపూజాం కరిష్యే ॥

యథావిధి కలశగణాధిపతిపూజాంచ కరిష్యే.

అథ నవగ్రహపూజా

## సూర్యస్య

మం॥ ఆ కృష్ణేన రజసా వర్తమానో ।
నివేశయ న్నమృతం మర్త్యం చ
హిరణ్యయేన సవితా రథేనాదేవో యాతిభువనాని పశ్యన్ ॥
సూర్యాయ నమః ఆవాహనాదిషోడశోపచారపూజాం సమర్పయామి

సూర్యగ్రహస్య దక్షిణతః అగ్ని మావాహయామి
స్థాపయామి పూజయామి ।
సూర్యగ్రహస్య ఉత్తరతః రుద్ర మావాహయామి
స్థాపయామి పూజయామి.

## చంద్రస్య

మం॥ అప్యాయస్వ సమేతు తే విశ్వత స్సోమవృష్ణియం
భవా వాజస్య సంగధే ॥
చంద్రాయ నమః ధ్యానావాహనాది
షోడశోపచారపూజాం సమర్పయామి ।
చంద్రగహస్య దక్షిణతః అపః అవాహయామి స్థాపయామి
పూజయామి ।
చంద్రగహస్యోత్తరతః గౌరీ మావాహయామి
స్థాపయామి పూజయామి ।

## అంగారకస్య

మం॥ అగ్ని ర్మూర్ధా దివః కకు-త్పతిః పృథివ్యాఅయం – అపాగ్ంరే
తాగ్ంసిజిన్వతి ।
అంగారకాయ నమః షోడశోపచారపూజాం
సమర్పయామి ।
అంగారకగ్రహస్య దక్షిణతః పృథివీ
మావాహయామి స్థాపయామి పూజయామి; అంగారకగ్రహస్య
ప్రత్యధిదేవతాం క్షేత్రపాలక మావాహయామి స్థాపయామి
పూజయామి ।

## బుధస్య

మం॥ ఉద్బుధ్యస్వాగ్నే ప్రతి జాగృహ్యేన
మిష్టా పూర్తే సగ్ం సృజేథా మయంచ –
పునః కణ్వగ్ం స్త్వా పితరం యువాన
మన్వాతాగ్ంసి త్వయి తంతు మేతమ్ ॥
బుధగ్రహాయ నమః షోడశోపచారపూజాం సమర్పయామి ।
బుధస్య అధిదేవతాం విష్ణు మావాహయామి; బుధగ్రహస్య ఉత్తరతః నారాయణ మావాహయామి ॥

## బృహస్పతేః

మం॥ బృహస్పతే అతి యదర్యో అర్హా
ద్యుమ ద్విభాతి క్రతుమ జ్జనేషు –
యద్దీదయచ్ఛవ సర్తప్రజాత
దస్మాసు ద్ర విణం దేహి చిత్రమ్ ॥
బృహస్పతిగ్రహం ఆవాహయామి స్థాపయామి పూజయామి
దక్షిణతః అధిదేవతాం బ్రహ్మాణం ఆవాహయామి స్థాపయామి పూజయామి
ఉత్తరతః ఇంద్ర మావాహయామి స్థాపయామి పూజయామి

## శుక్రస్య

మం॥ శుక్రం తే అన్య ద్యజతం తే అన్య
ద్విషురూపే అహనీ ద్యౌరివాసి
విశ్వాహి మాయా అవసి స్వధా వో

భద్రా తే పూష న్నిహ రాతి రస్తు ॥
శుక్రగ్రహదేవతాం ఆవాహయామి స్థాపయామి పూజయామి
శుక్రగ్రహస్య దక్షిణతః ఇంద్రాణీం ఆవాహయామి స్థాపయామి పూజయామి,
శుక్రగ్రహస్య ఉత్తరతః ఇంద్రం మరుత్వంతం ఆవాహయామి స్థాపయామి పూజయామి.

## శనైశ్చరస్య

మం॥ శమగ్ని రగ్నిభి స్కర చ్ఛ న్న స్తపతు సూర్యః ।
శం వాతో వాత్వరపా అప స్రిధః ॥
శనైశ్చరం ఆవాహయామి స్థాపయామి పూజయామి,
శనైశ్చరగ్రహస్య దక్షిణతః యమం ఆవాహయామి స్థాపయామి పూజయామి; తదుత్తరతః ప్రజాపతి మావాహయామి స్థాపయామి పూజయామి

## రాహోః

మం॥ కయా న శ్చిత్ర ఆభువ దూతీ సదా వృధ స్సఖా ।
కయా శచిష్ఠయా వృతా ॥
రాహుగ్రహదేవతా మావాహయామి స్థాపయామి పూజయామి.
రాహుగ్రహస్య దక్షిణతః గా మావాహయామి స్థాపయామి పూజయామి.
రాహుగ్రహస్య ఉత్తరతః సర్పమావాహయామి స్థావయామి పూజయామి.. ॥

## కేతోః

మం॥ కేతుం కృణ్వ న్న కేతవే పేశో మర్యా అపేశసే ।
శముషద్భి రజాయథాః.
కేతుగ్రహదేవతా మావాహయామి స్థాపయామి పూజయామి.
కేతుగ్రహస్య దక్షిణతః చిత్రగుప్త మావాహయామి స్థాపయామి పూజయామి.
కేతుగ్రహస్య ఉత్తరతః బ్రహ్మాణ మావాహయామి స్థాపయామి పూజయామి ।

## ఉమా మహేశ్వర పూజా

ఆచమ్య ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిధౌ శ్రీమతః............గోత్రస్య....................నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య మమాయురారోగ్యైశ్వర్య పుత్రపౌత్రాభివృద్ధ్యర్థం ఉమామహేశ్వర దేవతాప్రీత్యర్థం ఉమామహేశ్వరదేవతాయాః యావచ్ఛక్తి ధ్యానావాహనాదిషోడశోపచార పూజాంకరిష్యే ।
ఇతి సంకల్ప్య ఉమామహేశ్వర ప్రతిమాం సమానీయ ఏతత్ప్రతిమయోః కర్షణాదిసమస్తదోషపరిహారార్థ మాపోహిష్ఠేత్యాదిమంత్రై శ్శోధనం కృత్వా ।
ప్రాణ ప్రతిష్ఠా కార్యా ।

## ప్రాణ ప్రతిష్ఠా

అస్య శ్రీమదుమామహేశ్వరప్రాణప్రతిష్ఠాపనమహామంత్రస్య బ్రహ్మవిష్ణుమహేశ్వరా ఋషయః ॥ ఋగ్య జుస్సామాథర్వణవేదాః ఛందాంసి ॥ ప్రాణశక్తిః పరా దేవతా ॥ హ్రాం బీజం ॥ హ్రీం శక్తిః ॥ హ్రూం

కీలకమ్ ॥ ఉమామహేశ్వరప్రాణప్రతిష్ఠాసిద్ధ్యర్థే జపే వినియోగః ॥

## అంగన్యాసః

హ్రాం హృదయాయ నమః । హ్రీం శిరసే స్వాహా । హ్రూం శిఖాయై వషట్ । హ్రైం కవచాయ హుం । హ్రౌం నేత్రత్రయాయ వౌషట్ ॥ హ్రః । అస్త్రాయ ఫట్ ; భూ ర్భువ స్సువ రోమితి దిగ్బంధః ।

## ధ్యానమ్

శ్లో॥ ధ్యాయే త్తతో మహాదేవ ముమాదేహార్ధధారిణమ్
ముక్తామాలాపరీతాంగం దుకూలపరివేష్టితమ్.
పంచానన ముమాకాంత మనలేందురవిప్రభమ్
చంద్రార్ధశేఖరం నిత్యం జటామకుటమండితమ్ ।

ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం ళం క్షం అనయోః ప్రతిమయోః దేవ స్తిష్ఠతు । ఓం ఆం హ్రీం క్రోం ప్రతిమయోః సర్వేంద్రియాణి శ్రోత్రత్వక్చక్షు శ్శ్రోత్రజిహ్వాఘ్రాణ వాక్పాణిపాదపాయూపస్థాని ఇహైవాగత్య సుఖం చిరం తిష్ఠంతు స్వాహా ॥

మం॥ అసునీ తే పున రస్మాసు చక్షుః
పునః ప్రాణ మిహ నో ధేహి భోగమ్
జ్యోక్పశ్యేమ సూర్య ముచ్చరన్త
మనుమతే మృడయా న స్స్వస్తి.
అమృతం వై ప్రాణా అమృత మాపః - ప్రాణా నేవ
యథాస్థాన ముపహ్వాయతే ।
ఆవాహితౌ భవతం; స్థాపితౌ భవతం; స్థిరాసనం కురుతం;

ప్రసీదతం ప్రసీదతం ప్రసీదతమ్ ॥

## ధ్యానమ్

శ్లో॥ వేదాత్మానం దేవవంద్యం విష్ణుబ్రహ్మాదివందితమ్
విష్ణునేత్రార్చితారక్తపాదపంకజ ముత్తమమ్ ॥
శూలం డమరుకం చైవ దధానం హస్తయుగ్మకే
ఉమాదేవేశ మీశానం ధ్యాయే త్రిపురభంజనమ్ ॥
నమామి శిరసా గౌరీం ఆదివిద్యా మనామయామ్
లక్ష్మీసేవితపాదాబ్జాం శశిసేవితపాదుకామ్.
ప్రసన్నవదనాం శాంతాం స్మితపూర్వాభి భాషిణీం
స్తూయమానాం సదా దేవై ర్యజ్ఞదానైశ్చ కోటిశః ॥
శ్రీమదుమామహేశ్వరాభ్యాం నమః - ధ్యానమ్ ॥

## ఆవాహనమ్

శ్లో॥ కైలాసశిఖరా ద్రమ్యా ! త్పార్వత్యా సహిత ప్రభో !
ఆగచ్ఛ దేవదేవేశ మర్త్యలోకహితేప్సయా.
ఉమామహేశ్వరాభ్యాం నమః ॥ ఆవాహనమ్.

## ఆసనమ్

శ్లో॥ ఆసనేఽస్మి న్నుమాకాంత సుఖస్పర్శే తు నిర్మలే
ఉపవిశ్య మృడేదానీం సర్వశాంతిప్రదో భవ.
ఉమా మహేశ్వరాభ్యాం నమః - రత్నసింహాసనం సమర్పయామి ॥

## పాద్యమ్

శ్లో॥ పాద్యం చ తే మయా దత్తం పుష్పగంధసమన్వితమ్

దివ్యం పాద్యం ప్రదాస్యామి. గృహాణ వరదో భవ ।
ఉమామహేశ్వరాభ్యాం నమః - పాద్యం సమర్పయామి ।

## అర్ఘ్యమ్

శ్లో॥ గంధోదకేన పుష్పేణ చందనేన సుగంధినా
అర్ఘ్యం గృహాణ దేవేశ మయా దత్తం హి భక్తితః ।
ఉమామహేశ్వరాభ్యాం నమః - అర్ఘ్యం సమర్పయామి ।

## ఆచమనమ్

శ్లో॥ శీతలం నిర్మలం తోయం । కర్పూరేణ సువాసితం
ఉమామహేశ భగవన్ । గృహాణాచమనం విభో ! ।
ఉమామహేశ్వరాభ్యాం నమః - ఆచమనం సమర్పయామి ।

## మధుపర్కః

శ్లో॥ సర్వకాలుష్యహీనాయ । పరిపూర్ణసుఖాత్మనే
మధుపర్క. ముమాకాన్త । కల్పయామి ప్రసీద మే.
ఉమామహేశ్వరాభ్యాం నమః - మధుపర్కం సమర్పయామి ।

## అథ పంచామృతస్నానమ్

## క్షీరమ్

శ్లో॥ గోక్షీరం చ మతం స్వాదు రుచ్యం స్నిగ్ధం బలప్రదం
ఉమాకాంత మహాదేవ । స్నపనం క్రియతే మయా ।
ఉమామహేశ్వరాభ్యాం నమః క్షీరేణ స్నపయామి ।

## దధి

శ్లో॥ గవాం దధి స్వాదు బల్యం । రుచ్యం స్నిగ్ధం చ దీపనం
దధ్నా చైవ మయా దేవ । స్నపనం క్రియతే తవ ॥
ఉమామహేశ్వరాభ్యాం నమః - దధ్నాస్నపయామి. ॥

## ఆజ్యమ్

శ్లో॥ గోఘృతం తు రసే పాకే । స్వాదు శీతం గురు స్మృతం
ఉమాకాంత గృహాణేదం । శ్రద్ధయా సురసత్తమ ॥
ఉమామహేశ్వరాభ్యాం నమః - ఘృతేన స్నపయామి ॥

## మధు

శ్లో॥ మధు శీతం చ సు స్వాదు । రుచ్యం స్వర్యం చ గ్రాహకం
ఇదం మధు మయా దత్తం । తవ తుష్ట్యర్థమేవ చ ॥
ఉమామహేశ్వరాభ్యాం నమః - మధునా స్నపయామి ॥

## శర్కరా

శ్లో॥ శర్కరా చైవ రూక్షా తు । వాతపిత్తతృషాపహా
గృహాణ శంభో మద్దత్తాం । సుప్రసన్నో భవ ప్రభో ॥
ఉమామహేశ్వరాభ్యాం నమః - శర్కరయా స్నపయామి. ॥
ఉమామహేశ్వరాభ్యాం నమః పంచామృతస్నానం సమర్పయామి ॥

## శుద్ధోకస్నానమ్

శ్లో॥ కావేరీ నర్మదా వేణీ । తుంగభద్రా సరస్వతీ
స్నానం స్వీకురు దేవేశ । సదాశివ నమోస్తు తే ॥

'నమస్తే రుద్ర మన్యవ' ఇతి రుద్రసూక్తైః శుద్ధోదకస్నానమ్ ॥
ఉమామహేశ్వరాభ్యాం నమః శుద్ధోదకేన స్నపయామి; ఇతి స్నానమ్ ॥

## వస్త్రమ్

శ్లో॥ మాయాచిత్రపటచ్ఛన్న వస్త్రం గుహ్యోరుతేజసే
ఏత ద్వాసో మయా దత్తం సోత్తరీయం సుశోభనమ్ ॥
ఉమామహేశ దేవేశ వస్త్రం తే కల్పయామ్యహం
గృహాణ త్వంచ దేవేశ । మమ వాసఃప్రదో భవ ॥
ఉమామహేశ్వరాభ్యాం నమః వస్త్రయుగ్మం సమర్పయామి ॥

## ఉత్తరీయమ్

యమాశ్రిత్య మహామాయా । జగత్సంమోహినీ సదా
తస్మై తే పరమేశాయ । కల్పయా మ్యుత్తరీయకమ్ ।

## లింగయజ్ఞోపవీతమ్

శ్లో॥ స్వర్ణయజ్ఞోపవీతం చ । కాంచనం చోత్తరీయకం
రుద్రాక్ష మాలయా యుక్తం । దదామి స్వీకురు ప్రభో
ఉమామహేశ్వరాభ్యాం నమః లింగయజ్ఞోపవీతం సమర్పయామి॥

## భస్మ

శ్లో॥ అనాది శాశ్వతం శాంతం । చైతన్యం చిత్స్వరూపకం
చిదంగం వృషభాకారం । చిద్భస్మ లింగధారిణామ్ ॥
ఉమామహేశ్వరాభ్యాం నమః భస్మ పరికల్పయామి.

## గంధః

శ్లో॥ సుగంధం చందనం దివ్యం । మయా దత్తం తవ ప్రభో
భక్త్యా సమర్పితం ప్రీత్యా । మయా గంధాది గృహ్యతామ్.
ఉమమహేశ్వరాభ్యాం నమః గంధం పరికల్పయామి ।

## అక్షతాః

శ్లో॥ అక్షతా వ్రీహిసంభూతా రత్నాఢ్యాశ్చాప్యఖండితాః
అలంకారాయ భూయాసు రక్షతైః ప్రీయతాం ప్రభుః ।
ఉమామహేశ్వరాభ్యాం నమః అక్షతాన్ సమర్పయామి.

## హరిద్రాకుంకుమచూర్ణమ్

శ్లో॥ హరిద్రా కుంకుమం చైవ సిందూరం కజ్జలాదికం
నీలలోహిత తాటంకే అలంకార ముమాప్రియ ।
ఉమామహేశ్వరాభ్యాం నమః సుగంధపరిమళద్రవ్యాణి సమర్పయామి।

## నానావిధ భూషణాని

శ్లో॥ స్వభావసుందరాంగాయ నానారత్నాశ్రయాయ తే
భూషణాని పరిగ్రాహ్యే ణ్యు ఉమాకాంత నమోస్తు తే ।
ఉమామహేశ్వరాభ్యాం నమః నానావిధరత్నఖచితసువర్ణభూషణాని సమర్పయామి.

## అథ శివాంగ పూజా

ఓం పరమేశ్వరాయ పార్వత్యై నమః పాదౌ పూజయామి ।
ఓం జగద్గురవే జగదంబాయై నమః జంఘే పూజయామి ।

ఓం జగత్ప్రాణాయ జగజ్జనన్యై నమః జానునీ పూజయామి ॥

ఓం ఊర్ధ్వాయ ఉమాయై నమః ఊరూ పూజయామి ॥

ఓం గుహేశ్వరాయ గుహజనన్యై నమః గుహ్యం పూజయామి ।

ఓం కపర్దినే కామరూపిణ్యై నమః కటిం పూజయామి ॥

ఓం నాగేశ్వరాయ నగతనయాయై నమః నాభిం పూజయామి ।

ఓం ఉత్తమాంగాయ ఉగ్రస్య పత్న్యై నమః ఉదరం పూజయామి ।

ఓం హృదీశాయ హృత్పద్మవాసిన్యై నమః హస్తౌ పూజయామి ॥

ఓం భుజంగభూషణాయ భుక్తిముక్తిప్రదాయిన్యై నమః
భుజౌ పూజయామి ।

ఓం కలాధరాయ కాంత్యై నమః కంఠం పూజయామి ।

ఓం మునిప్రియాయ కల్యాణ్యై నమః ముఖం పూజయామి ।

ఓం నేత్రత్రయాయ నేత్రదేవ్యై నమః నేత్రాణి పూజయామి ।

ఓం లలాటాక్షాయ లలితాయై నమః లలాటం పూజయామి ॥

ఓం శివాయ శిష్టేష్టాయై నమః శిరః పూజయామి ।

ఓం మోక్షఫలాయ మోహనకారిణ్యై నమః మౌళిం పూజయామి ।

ఓం సర్వేశ్వరాయ సర్వమంగళాయై నమః సర్వాంగాణి పూజయామి ।
।

తతః శివాష్టోత్తరశతనామభిః పూజయేత్

ఓం శివాయ నమః
ఓం మహేశ్వరాయ నమః
ఓం శంభవే నమః
ఓం పినాకినే నమః
ఓం శశిశేఖరాయ నమః
ఓం వామదేవాయ నమః
ఓం విరూపాక్షాయ నమః
ఓం కపర్దినే నమః
ఓం నీలలోహితాయ నమః
ఓం శంకరాయ నమః 10
ఓం శూలపాణయే నమః
ఓం ఖట్వాంగినే నమః
ఓం విష్ణువల్లభాయ నమః
ఓం శిపివిష్టాయ నమః
ఓం అంబికానాథాయ నమః
ఓం శ్రీకంఠాయ నమః
ఓం భక్తవత్సలాయ నమః
ఓం భవాయ నమః
ఓం శర్వాయ నమః
ఓం త్రిలోకేశాయ నమః 20
ఓం శితికంఠాయ నమః
ఓం శివాప్రియాయ
ఓం ఉగ్రాయ నమః
ఓం కపాలినే నమః
ఓం కామారయే నమః
ఓం అంధకాసుర సూదనాయ నమః
ఓం గంగాధరాయ నమః
ఓం లలాటాక్షాయ నమః
ఓం కాలకాలాయ నమః
ఓం కృపానిధయే నమః 30
ఓం భీమాయ నమః
ఓం పరశుహస్తాయ నమః
ఓం మృగపాణయే నమః
ఓం జటాధరాయ నమః
ఓం కైలాస వాసినే నమః
ఓం కవచినే నమః
ఓం కఠోరాయ నమః
ఓం త్రిపురాంతకాయ నమః
ఓం వృషాంకాయ నమః
ఓం వృషభారూఢాయ నమః 40
ఓం భస్మోద్ధూళితవిగ్రహాయ నమః
ఓం సామప్రియాయ నమః
ఓం స్వరమయాయ నమః
ఓం త్రయీమూర్తయే నమః
ఓం అనీశ్వరాయ నమః
ఓం సర్వజ్ఞాయ నమః
ఓం పరమాత్మనే నమః
ఓం సోమసూర్యాగ్నిలోచనాయ నమః
ఓం హవిషే నమః
ఓం యజ్ఞమయాయ నమః 50
ఓం సోమాయ నమః
ఓం పంచవక్త్రాయ నమః
ఓం సదాశివాయ నమః
ఓం విశ్వేశ్వరాయ నమః

ఓం వీరభద్రాయ నమః
ఓం గణనాథాయ నమః
ఓం ప్రజాపతయే నమః
ఓం హిరణ్యరేతసే నమః
ఓం దుర్ధర్షాయ నమః
ఓం గిరీశాయ నమః 60
ఓం గిరిశాయ నమః
ఓం అనఘాయ నమః
ఓం భుజంగభూషణాయ నమః
ఓం భర్గాయ నమః
ఓం గిరిధన్వనే నమః
ఓం గిరిప్రియాయ నమః
ఓం కృత్తివాససే నమః
ఓం పురారాతయే నమః
ఓం భగవతే నమః
ఓం ప్రమథధిపాయ నమః 70
ఓం మృత్యుంజయాయ నమః
ఓం సూక్ష్మతనవే నమః
ఓం జగద్వ్యాపినే నమః
ఓం జగద్గురవే నమః
ఓం వ్యోమకేశాయ నమః
ఓం మహాసేనజనకాయ నమః
ఓం చారువిక్రమాయ నమః
ఓం రుద్రాయ నమః
ఓం భూతపయే నమః
ఓం స్థాణవే నమః 80
ఓం అహిర్బుధ్న్యాయ నమః
ఓం దిగంబరాయ నమః
ఓం అష్టమూర్తయే నమః
ఓం అనేకాత్మనే నమః
ఓం సాత్త్వికాయ నమః
ఓం శుద్ధవిగ్రహాయ నమః
ఓం శాశ్వతాయ నమః
ఓం ఖండపరశవే నమః
ఓం అజాయ నమః
ఓం పాశవిమోచకాయ నమః 90
ఓం మృడాయ నమః
ఓం పశుపతయే నమః
ఓం దేవాయ నమః
ఓం మహాదేవాయ నమః
ఓం అవ్యయాయ నమః
ఓం హరయే నమః
ఓం పూషదంతభిదే నమః
ఓం అవ్యగ్రాయ నమః
ఓం దక్షాధ్వరహరాయ నమః
ఓం హరాయ నమః 100
ఓం భగనేత్రభిదే నమః
ఓం అవ్యక్తాయ నమః
ఓం సహస్రాక్షాయ నమః
ఓం సహస్రపాదే నమః
ఓం అపవర్గప్రదాయ నమః
ఓం అనంతాయ నమః
ఓం తారకాయ నమః
ఓం పరమేశ్వరాయ నమః 108

## పుష్పమ్

శ్లో॥ మాలతీచంపకాదీని కుముదా న్యుత్పలాని చ
బిల్వపత్రాణి పూజార్థం స్వీకురు త్వ ముమాపతే ॥
ఉమామహేశ్వరాభ్యాం నమః పుష్పాణి సమర్పయామి.

## బిల్వపత్రాణి

శ్లో॥ త్రిదళం త్రిగుణాకారం । త్రినేత్రం చ త్రియాయుధం
త్రిజన్మపాపసంహారం । ఏకబిల్వం శివార్పణమ్ ॥
శ్లో॥ త్రిశాఖై ర్బిల్వపత్రైశ్చ । అచ్ఛిద్రైః కోమలై శ్శుభైః
తవ పూజాం కరిష్యామి ఏకబిల్వం శివార్పణమ్ ॥
శ్లో॥ దర్శనం బిల్వ వృక్షస్య । స్పర్శనం పాపనాశనం
అఘోరపాపసంహారం । ఏకబిల్వం శివార్పణమ్ ॥
ఉమా మహేశ్వరాభ్యాం నమః బిల్వపత్రం సమర్పయామి.

## సూత్రగ్రంథి పూజా

౧ పరమేశ్వరాయ పార్వత్యై నమః ప్రథమగ్రంథిం పూజయామి
౨ ద్విపదే ద్విలోచన్యై నమః ద్వితీయగ్రంథిం పూజయామి
౩ త్రినేత్రాయ త్రిలోచనాయై నమః తృతీయగ్రంథిం పూజయామి
౪ చతుర్వేదాయ చండికాయై నమః చతుర్థగ్రంథిం పూజయామి
౫ పంచాక్షరాయ పరబ్రహ్మస్వరూపిణ్యై నమః పంచమగ్రంథిం పూజయామి
౬ షట్చక్రాధిష్ఠాయై సదాశివాయ నమః షష్ఠగ్రంథిం పూజయామి
౭ సర్వాత్మనే సర్వాభీష్టప్రదాయై నమః సప్తమగ్రంథిం పూజయామి

౮ అభయాయ అనశ్వరాయై నమః అష్టమగ్రంథిం పూజయామి
౯ నటేశాయ నారాయణ్యై నమః నవమగ్రంథిం పూజయామి
౧౦ దక్షిణామూర్తయే ధర్మనిష్ఠాయై నమః దశమగ్రంథిం పూజయామి
౧౧ ఏకాదశరూపాయ రుద్రాయ నమః ఏకాదశగ్రంథిం పూజయామి
౧౨ ద్వాదశాదిత్యవందితాయ నమః ద్వాదశగ్రంథిం పూజయామి
౧౩ త్రయోదశవిశ్వహితాయ నమః త్రయోదశగ్రంథిం పూజయామి
౧౪ చంద్రశేఖరాయచాముండాయై నమః చతుర్దశగ్రంథిం పూజయామి
౧౫ పరమాణవే పరాయై నమః పంచదశగ్రంథిం పూజయామి

## ధూ ప ః

శ్లో॥ దేవద్రుమరసోద్భూతం కాలాగురుసమన్వితం
ఆఘ్రాయతా మయం ధూప ఉమయా సహిత ప్రభో ।
ఉమామహేశ్వరాభ్యాం నమః ధూపం సమర్పయామి ।

## దీ ప ః

శ్లో॥ దీపం చ పరమం శంభో ఘృతవర్తిషు యోజితం
దత్తం గృహాణ దేవేశ మమ జ్ఞానప్రదో భవ ।
ఉమామహేశ్వరాభ్యాం నమః దీపం దర్శయామి ।

## నై వే ద్య మ్

శ్లో॥ అన్నం చతుర్విధం స్వాదు రసై షడ్భి స్సమన్వితం
భక్ష్యభోజ్యసమాయుక్తం నైవేద్యం ప్రతిగృహ్యతామ్ ।
ఉమామహేశ్వరాభ్యాం నమః నైవేద్యం సమర్పయామి ।

## మ ధ్యే పా నీ య మ్

శ్లో॥ నైవేద్యమధ్యే పానీయం మయా దత్తం హి భక్తితః
స్వీకురుష్వ మహాదేవ ప్రసన్నో భవ సర్వదా ॥

## ఉ త్త రా పో శ న మ్

శ్లో॥ ఉత్తరాపోశనార్థం తవాఽఽ నీతం జల ముత్తమమ్
గృహాణ త్వ ముమాకాంత సర్వదుఃఖనివారక ॥
ఉమామహేశ్వరాభ్యాం నమః ఉత్తరాపోశనం సమర్పయామి.

## తా ం బూ ల మ్

శ్లో॥ కర్పూరై లాలవంగాదిపూగీఫలసమన్వితమ్
తాంబూలం కల్పితం భక్త్యా గృహాణ గిరిజాప్రియ ॥
ఉమామహేశ్వరాభ్యాం నమః తాంబూలం సమర్పయామి.

## ద క్షి ణా

శ్లో॥ హిరణ్యగర్భగర్భస్థం । హేమ బీజం విభావసోః
అనంతపుణ్యఫలదం । అత శ్శాంతిం ప్రయచ్ఛ మే ॥
ఉమామహేశ్వరాభ్యాం నమః దక్షిణాం సమర్పయామి.
శ్రీ మదుమామహేశ్వరార్పణమస్తు

:: నమః శివాభ్యామ్ ::

# శ్రీ ఉమామహేశ్వర వ్రత కల్పము

## ప్రథమాధ్యాయము

శ్లో॥ ఏకదా గౌతమో యోగీ। పరానుగ్రహలిప్సయా
సంచర న్సకలాన్ లోకాన్। నృలోకం సముపాగతః॥

౨ ఆలోకయిత్వా తా న్సర్వాన్। వివిధక్లేశసంయుతాన్
నానాయోనిసమాకీర్ణాన్। జనాన్ దుఃఖవశంవదాన్॥

౩ ఏతేషాం దుఃఖవై నాశ్యం। కేనోపాయేన సంభవేత్
ఏవ మాలోచనం కృత్వా। శంభులోకం గత స్తదా॥

తా॥ ఓ శౌనకాది మునులారా! పూర్వము ఒకానొకప్పుడు గౌతమ మునివరుండు లోకములందు సంచారమొనర్చుచు మర్త్యలోకమునకు వేంచేసినవాడై యనేక దుఃఖములకు లోనై నానాయోనులయందు బుట్టుచు నానా కష్టముల ననుభవించుచు మిక్కిలి బాధ జెందుచున్న మనుష్యులను దిలకించి యీ విధమగు బాధలనుండి మానవులను దరింపజేయుటకై యుపాయాన్వేషణముతో కైలాసమున కరిగెను.

౪ కోటిసూర్యప్రతీకాశం। స్ఫాటికాకృతితై జసం
భస్మోద్ధూళిత సర్వాంగం। రుద్రాక్షైరపి భూషితమ్॥

౫ త్రిశూలధారిణం దేవం। ఉమయా సహితం ప్రభుమ్
తం దృష్ట్వా జగతాం నాథం। ఋగ్యజుస్సామభి ర్యుతమ్
స్తోత్రం కృత్వా తు స ఋషి రాససాద వరాననే
తత స్తుష్టో పశుపతిర్। గౌతమం ప్రత్యభాషత॥

తా॥ కైలాసములో కోటిసూర్య ప్రకాశముతో స్ఫటికమణివలె నొప్పారుచు సర్వాంగములయందును భస్మత్రిపుండ్రములను దాల్చి, రుద్రాక్షమాలాలంకృతుండై త్రిశూలమును చేత నిడుకొని అర్ధాంగినియైన పార్వతీదేవితో గూడి యాసీనుడై యున్న యా పరమాత్మని గాంచిన గౌతమ మునివరేణ్యుడు ఆపరమశివుని స్తుతించి ప్రార్థించ ఆప్రార్థనల నాలకించిన సదాశివుండు గౌతమునితో నిట్లానతిచ్చినవా డయ్యెను.

౭ కిమర్థమాయాసి కి మస్తి చిత్తే ।
కిం కారణం బ్రూహి ఋషీంద్రవర్య ॥
తద్బ్రూహి సర్వం కథయామి భద్రం
ప్రాప్స్యసి సర్వం భవదుఃఖనాశమ్ ॥

తా॥ ఓయీ ! గౌతమమహర్షి! నీవేల ఇచటికి వచ్చినాడవు? నీ హృదయమున నున్న సందేహముల నన్నింటిని నా కెఱిగింపుము. నీ సంశయముల నన్నింటికిని నేను ఉచితసమాధానములను వివరించెదను, అనెను. మర్త్యలోకే జనాస్సర్వే నానా క్లేశ సమన్వితాః

౮ తత్కథం శమతాం యాతి । లఘూపాయేన బ్రూహిమే
త త్సర్వం శ్రోతు మిచ్ఛామి । భక్తాభీష్ట ప్రదాయక ॥

తా॥ అప్పుడు గౌతముడు ఇట్లు పల్కెను. ఓ మహాదేవా ! మర్త్యలోకమున మానవులు అనేకవిధములగు దుఃఖముల ననుభవించుచున్నారు. నానా యోనులందు జన్మించుచు ననేక పాపములతో పీడింపబడుచున్నారు. కావున అట్టిబాధలనుండి యుపశమనము బడయు మార్గమేదైన ఉండిన దాని నానతిమ్మని వేడుచున్నాను. కనుక విపులముగా వివరింపవల్సినదిగా గౌతముడు శివుని ప్రార్థించెను.

అది విని ఈశ్వరు డిట్లానతిచ్చెను.

౯ భో సాధు పృష్టం సద్వృత్తం । లోకానుగ్రహవాంఛయా
ముచ్యతే సర్వపాపేభ్యః । తదుపాయస్తు వక్ష్యతే ॥

౧౦ దుర్లభం వ్రత మేతత్తు । వాత్సల్యా త్కథ్యతే మయా
ఉమామహేశ్వరం నామ । వ్రత మస్తి వ్రతోత్తమమ్ ॥

౧౧ యః కరోతి విధానేన సర్వా న్కామా నవాప్ను యాత్ ॥

తా॥ గౌతమ మహర్షి ప్రార్థనను ఆలకించి ప్రపంచములోని ప్రజలకు గలిగిన కష్టములు దొలగిపోయి అనాయాసముగ పుణ్యప్రాప్తిని గలిగించే ఉమామహేశ్వరవ్రతకల్పమును జెప్పుచున్నాను; వినుము. ఇట్టివ్రతమును యథాశాస్త్రముగా నొనర్చువారు సమస్త అష్టైశ్వర్యములను బడయుదురు.

గౌతమ ఉవాచ

ఆకర్ణ్య భగవద్వాక్యం । గౌతమో ఋషిసత్తమః ॥

౧౨ భగవ న్కేన విధినా । కర్తవ్యం వ్రత ముత్తమమ్
కథంకార్యం కదా కార్యం । ఫలం కిం కేన వా కృతమ్ ।

౧౩ త త్సర్వం బ్రూహి భగవన్ । శ్రోతు మిచ్ఛామి శంకర

తా॥ శంకరుని వాక్యములను విని మరల గౌతము డిట్లు ప్రశ్నించెను. ఓ పరశివమూర్తీ! ఈ వ్రతము నాచరించువారికి యెటువంటి ఫలము లభించును; ఏవిధముగ దీని నాచరించవలయును. ఏ సమయమున జేయవలయును? ఇంతకు బూర్వమెవరు దీనిని గావించిరి. ఇట్టి వివరములన్నింటిని సవిస్తారమున బోధించు మని ప్రార్థించెను.

మహేశ్వర ఉవాచ

సుముహూర్తే సుదివసే భక్తిశ్రద్ధాసమన్వితః ॥

౧౪ మోహశోకాదినాశాయ । పుత్రపౌత్రాభివృద్ధయే
సర్వైశ్వర్యప్రదం పాప । శమనం బంధమోచనమ్ ॥

౧౫ సాయంకాలే తు కర్తవ్యం । ఉమామహేశ్వరం వ్రతం
కృతధర్మపరో భూత్వా । భక్త్యా నైవేద్య మర్పయేత్ ॥

౧౬ కదళీఫలం చ క్షీరం చ । భక్ష్యాపూపసమన్వితమ్
ఘృతశర్కర గోధూమ । చూర్ణం వా శాలిచూర్ణకమ్ ॥

౧౭ ఏకీకృత్యైవ తత్సర్వ । మీశ్వరాయ నివేదయేత్
పూగీఫలైశ్చ తాంబూలం । కర్పూరేణ సమన్వితమ్ ॥

౧౮ దక్షిణాం చ యథాశక్త్యా । దద్యా న్మాహేశ్వరాయ చ
శ్రుత్వా కథాం బంధుభిశ్చ । భోజయేచ్చ యథావిధి ॥

౧౯ నృత్యగీతాదినిస్వానై । స్తతో మంగళ మాచరేత్
స్వస్థచిత్తో భవే న్నిత్య । ముమామహేశ్వరౌ స్మరన్ ॥

౨౦ ఏవం వ్రతం కృతే తస్య । సర్వసిద్ధి ర్భవేద్ధ్రువమ్
లఘూపాయేన భూభాగే । కలికాలే విశేషతః ॥

౨౧ లోకకళ్యాణసిద్ధ్యర్థం । ఉమామహేశ్వరవ్రతం
ఇహాముత్రఫలప్రాప్త్యై । కథితం తవ గౌతమ ॥

తా॥ లోకకళ్యాణమునభిలషించునట్టి గౌతమ ఋషిని గూర్చి శివుడు ఇట్లానతిచ్చెను. ఈ వ్రతమును జేయదలచినవాడు మొట్టమొదట తనగురువును, మాహేశ్వరులను, బంధుమిత్రులను తన గృహమునకు

రప్పించుకొని మంగలకరమైన శుభముహూర్తమునందు భక్తి శ్రద్ధా ప్రపత్తులతో గూడినవాడై యీ వ్రతమునాచరించవలయును. మరియు భక్ష్యములు, అరటిపండ్లు, పాలు, నెయ్యి, గోధుమపిండి, శర్కర వీటితో గలుపబడిన పదార్థములను నైవేద్యముగా సమర్పించి, పిమ్మట గురు మాహేశ్వర-బంధుమిత్రులకు సంతృప్తిగా భోజనములు జేయించి తాను నైవేద్యముగా సమర్పించిన ప్రసాదమును ఉమామహేశ్వరులను సంస్మరించుచు భుజించి గురు - మాహేశ్వరులకు దగినట్లుగా దక్షిణ తాంబూలాదులను భక్తితో సమర్పించి నృత్య-గీతాది-మంగల వాద్యంబులతో సన్మానించిన యెడల మానవులు తామభిలషించినట్టి కోరికలు ఫలించి యిహ-పరములను బడయగలరు.

ఇట్లు మొదటి అధ్యాయము సమాప్తము

## ద్వితీయోధ్యాయః

రాజా ఉవాచ -

శ్లో॥ గౌతమేంద్ర పురా కేన వ్రతం చీర్ణం వదస్వ మే
కస్య కామస్యాభూ త్సిద్ధిర్ వ్రతస్యాస్య ప్రభావతః । ౧

తా॥ మిత్రసహుడను రాజు గౌతమమహర్షిని జూచి, మునీశ్వరా! సమస్తకోరికల ఫలప్రదమైన ఈ యుమామహేశ్వరవ్రతమును ప్రథమమున యెవరాచరించిరి; దానివలన నెట్టి ఫలమును బడసిరి అని ప్రశ్నించెను.

గౌతమ ఉవాచః-

శ్లో॥ ఇత్యుక్తః శైవవర్యేణ । తదా గౌతమసంయమీ
భూప శైవవరో రాజన్ ॥ దూర్వాసాఖ్యో మునీశ్వరః ౨
కదాచి త్సంచరన్లోకా న్జగామ కమలాపతిమ్ ॥

తా॥ తొల్లిటికాలమున శైవమునీశ్వరుడగు దూర్వాసులవారు పలులోకములను బర్యటించుచు వైకుంఠవాసియగు విష్ణుమూర్తి వద్దకు విచ్చేసెను.

తత స్సమాగతో విష్ణుం దృష్ట్వా దూర్వాససంయమీ ॥3

బిల్వమాలాం దదౌ తస్మై । శంకరేణ ప్రసాదితాం

గృహిత్వా బిల్వమాలాం తాం । హరి ర్గమనసంభ్రమాత్ ॥

శిరసా పూజనీయాం తాం గరుడస్య గళేఽ క్షిపత్ ॥

తా॥ దూర్వాసులవారు విష్ణుమూర్తియందుగల ప్రేమతో కైలాసమున శంకరుని ( శ్రీమహాదేవుని) చేత ననుగ్రహించబడిన బిల్వదళమాలికను విష్ణుమూర్తికి యొసఁగగా అట్టి బిల్వమాలను శిరసాధరించి తరువాత ప్రయాణపుహడావిడిలో దనకు వాహనమైన గరుత్మంతుని కంఠమున వేసెను.

తత స్తం తాదృశం దృష్ట్వా దుర్వాసాః క్రోధమూర్ఛితః

హరిం శశాప బహుధా ధిగ్ఞన్మేతి చ సంవదన్

మయా శివార్పితా దత్తా మాలా తుభ్య మఘాపహా ॥ ౬

సా కథం గరుడస్కంధే వినిక్షిప్తా త్వయా హరే ॥ ౭

తా॥ తానను గ్రహించిన బిల్వమాలికను విష్ణువు గరుత్మంతుని మెడలో వేయుటను జూచిన దూర్వాసుడు పట్టరాని కోపముతో విష్ణుమూర్తిని ఈ విధముగ శపించెను. నాకు శివానుగ్రహమువలన లభించిన ప్రసాదబిల్వమాలిక నీమహాపాపములను బోగొట్టునని నీకు నేను ప్రసాదించగా అట్టిదానిని నీవు సిరిసంపదల గర్వముచేత నీవాహనమైన గరుత్మంతుని మెడలో వేసినాడవు; కాన నీకు నేను శాపము

నాసగుచున్నాడను.

౮ సర్వస్వమూలభూతేయం లక్ష్మీ స్తవ వినశ్యతు
లక్ష్మీః పతతు దుగ్ధాబ్ధౌ । గరుడోఽపి వినశ్యతు
వైకుంఠస్యాధికారోఽపి । తవ యాతు మదాజ్ఞయా ॥

౯ నిస్తేజస్కో వనే కృష్టే । సంచారస్ తు భవేత్తవ
ఇత్యుక్త్వా స తు దుర్వాసా॥ యయౌ లోకాంతరం నృప.

తా॥ ఓయి విష్ణుమూర్తి! నీ విట్లు గర్వించుటకు నిన్ను వరించిన సిరినంవదలే మూలకారణమై యున్నవి. అందువలన నీ లక్ష్మి పాలసముద్రముపాలగుగాక, నేటినుండి నీకు వైకుంఠాధికారము లేక ఏకాకివై శక్తిశూన్యుడవై అరణ్యములందు - చెట్టు చెట్టు - గట్టు గట్టులు గిరిగుహలన్ దిరుగుచు ననేక యాతనల ననుభవింతువుగాక యని విష్ణుని శపించి దుర్వాసుడు వెళ్ళిపోయెను.

౧౦ తతః పపాత దుగ్ధాబ్ధౌ । లక్ష్మీ ర్విష్ణుమనోహరీ
తతోఽతిదుఃఖితో విష్ణుః । ప్రలపన్వన మాశ్రితః ॥

౧౧ ఉవాస విపినే ఘోరే । స్వకృతం కర్మ సంస్మరన్
తతః కదాచి ద్భూపాల । గతోఽహం విపినం మహత్ ॥

౧౨ సంకటేషు హరిం దృష్ట్వా । అవోచం కిమిదం హరే
క్వ చ లక్ష్మీః క్వ వా తార్క్ష్యః । క్వ వాసః కిం కరోషి చ ।

తా॥ లక్ష్మీదేవి పాలసముద్రమును చేరినపిదప తాను భరింపలేని విషాదముచేత దట్టమైన అరణ్యములందు ప్రవేశించి తాను జేసిన పొరపాటును గ్రహించి ఈశ్వరానుగ్రహము లేనివారు ఇట్లే యనేక బాధలకు గురియగుదు రని తనలో మథనపడుచుండగా గౌతమఋషి యా

అరణ్యమునకు వెళ్ళి ఓయీ విష్ణుమూర్తీ! నీ లక్ష్మీదేవియు నీవాహనమైన గరుత్మంతుడునెక్కడికి వెళ్ళిరి. ఇక్కడ నీ వొంటరిగా నేమి చేయుచున్నాడవని ప్రశ్నించెను.

౧౩ తతోఽ శ్రుపూర్ణ నయనః । కృతాంజలిపుటో హరిః
జగాద గతవృత్తాంతం । లక్ష్మీగమనకారణమ్ ॥

౧౪ శ్రుత్వాఽహం తు శివం ధ్యాత్వా । విష్ణవే వ్రత ముత్తమమ్
ఉమామహేశ్వరం నామ । సర్వకామఫలప్రదమ్ ॥

తా॥ అప్పుడు విషాదసాగరమున బడియున్న విష్ణుమూర్తి తన చరిత్రనంతటిని గౌతమునికి విన్నవించెను. అది విని లక్ష్మీగరుత్మంతులు మరల యథాస్థానములు చేరునటుల శ్రీమదుమామహేశ్వరుల వ్రతమును శ్రీమహాదేవుని మనస్సులో మననము గావించుమని యుపదేశించెను.

౧౫ తత శ్శీఘ్రం చ విధివ చ్చకార । శ్రమసంతతః
తతః ప్రసన్నో భగవాన్ । విష్ణవే పార్వతీపతిః ॥

౧౬ దదౌ లక్ష్మీం సగరుడాం । కరుణానిధి రవ్యయః
తతః కైలాస మగమత్ । ఉమయా సహ పార్థివ ॥

తా॥ ఆ పిదప విష్ణుమూర్తి భక్తిశ్రద్ధలు వహించినవాడై శ్రీమదుమామహేశ్వర వ్రతమును యథావిధిగా నాచరింవగా శ్రీపార్వతీపరమేశ్వరులు ప్రసన్నులై తమ కనన్యభక్తుడైన విష్ణుమూర్తికి లక్ష్మిని – గరుత్మంతుని వైకుంఠాధికారమును తొల్లిటి వైభవమును అనుగ్రహించి ఆశీస్సులొసంగి మరల కైలాసమున కరిగిరి.

౦

ఇట్లు ద్వితీయాధ్యాయము సమాప్తము

# అథ తృతీయోధ్యాయః

గౌతమ ఉవాచ :-

శ్లో॥ మిథిలాయాం పురా దివ్యా జనకస్య సుతా శుభా
సీతేతి నామ్నా విఖ్యాతా సర్వావయవసంపదా ॥
౨ వివాహసమయే తస్యాః ఏవం మతి రజాయత
దశరథస్య సుతో రామః కథం భర్తా భవిష్యతి ॥
౩ ఇతి సంచింత్య మనసా శతానందం దదర్శ సా
శతానందోపి తాం కన్యాం బభాషే తాం మనస్వినీమ్ ॥
౪ అయి వత్సే మహాభాగే కిమర్థం చింతయిష్యసి
లజ్జాం విహాయ సా సీతా శతానంద మువాచహ ॥
౫ శతానంద మమ ప్రీతీ రామే లగ్నా మనోహరే
స కథం లభ్యతే బ్రూహి కర్తు మిచ్ఛామి బ్రాహ్మణ ॥
౬ తదాచచక్షే భగవాన్ శతానందో మహామునిః ॥
ఉమామహేశ్వరం నామ వ్రత మస్తి ఫలప్రదమ్ ॥
౭ సర్వా న్కామా నవాప్నోతి వ్రతస్యాస్య ప్రభావతః
లక్ష్మీః పురా వ్రతం కృత్వా భర్తారం ప్రాప కేశవమ్ ॥
౮ బ్రహ్మాణ ముపయేమే సా వాణీ వ్రతవిధానతః
శచీ వ్రతప్రభావేన ఇంద్రేణోఢా శుచిస్మితే ॥
తస్మా త్త్వమపి సీతేదం వ్రతం కృత్వార్థ కామదమ్ ॥
౯ భర్తార మాత్మసదృశం రామం ప్రాప్స్యసి సువ్రతే

శతానందముఖా చ్ఛ్రుత్వా కృతం మహేశ్వరవ్రతమ్ ॥
౧౦ తత్ప్రభావా చ్ఛీఘ్రమేవ పతిం విందత రాఘవం
తస్మా త్సర్వైశ్చ మనుజైః కర్తవ్యం వ్రత ముత్తమమ్ ॥
౧౧ బాలో విద్యా మార్జయతి యూనా సర్వమవాప్యతే
కన్యా విందతి భర్తారం వ్రతస్యాస్య ప్రభావతః ॥

తా॥ తొల్లి ఒకప్పుడు మిథిలానగరమును బరిపాలించుచున్న జనకమహారాజుకు సమస్తావయవసౌందర్యముగల సీతయను కన్యగలదు. ఆ కన్య వివాహవయస్సు వచ్చువరకు దశరథమహారాజా తనయుడైన శ్రీరామచంద్రుని వివాహ మాడదలంచి ఆలోచించుచుండగా తమ పురోహితుండగు శతానందుని వైపు చూచెను. శతానందుడు అమ్మా! ఏమి విచారించుచున్నావని ప్రశ్నించెను. అది విని సీత బిడియమువీడినదై తనకు శ్రీరామునియందు చిత్తము దగులుకొనియున్నది. కావున తనయభీష్టము సిద్ధించు మార్గ మేదియైన యుండినచో ఆనతిమ్మని అర్థించెను. అదివిని శతానందుడు ఉమామహేశ్వరవ్రత మొండు గలదు. అట్టి వ్రతము నాచరించి తత్ప్రభావమువలన తొల్లి లక్ష్మీదేవి శ్రీమహావిష్ణువును, సరస్వతి బ్రహ్మను, శచీదేవి దేవేంద్రుని వివాహమాడిరి.

కావున అట్టి మహావ్రతమును నీవును ఆచరించిన శ్రీరామచంద్రుడే నీకు భర్త కాగలడు, అని యానతి నొసగెను. కనుక బాలురు ఈ వ్రతము నాచరించినచో వారికి విద్యాప్రాప్తి గలుగును, యుక్తవయస్కులాచరించినయెడల సమస్త మనోరథములు సిద్ధించును. కన్య లాచరించిన తాము గోరిన వరుని వరింతురు, అందుచేత నీవ్రతము సమస్తజను లాచరింప దగినది.

ఇట్లు తృతీయాధ్యాయము సమాప్తము

## అథ చతుర్థాధ్యాయః

మహేశ్వర ఉవాచ :-

శ్లో॥ శృణు ప్రభావం వ్రతగౌరవం మునే
దిక్పాలబృందైశ్చ కృతం యథావిధి ।
ఇష్టార్థసిద్ధి ర్భవితా సదానృణాం
స్త్రీణాం చ మాంగళ్యవివృద్ధి రిత్యపి ।

౨ పురా కుబేరో కృతవా నిదం వ్రతం
మహేశ్వరం నామ శుభం యథావిధి
సర్వా న్నిధీన్ ప్రాప్య సుఖేన మోదతే
కరోతి భక్తిశ్చ సదా మహేశ్వరే ।

౩ పురా మగధదేశే తు ధనధాన్యసమృద్ధిమాన్
ధర్మగుప్తేతి విఖ్యాతో వైశ్యేషు గుణవత్తమః ।

౪ తస్య భార్యా సురూపాఖ్యా గుణశీలయుతా సతీ
సంతానం నహి తస్యాఽఽసీ ద్బహుకాలే గతేపి చ ।

౫ తదా మనసి చింతాఽభూత్ వ్యర్థం జన్మేతి చాసకృత్
దంపతీ చింతితౌ నిత్యం సంతోషం నోపలేభిరే ।

౬ కదాచి దటనం కుర్వన్ అగతో ఋషిసత్తమః
దధీచిర్నామ బ్రహ్మర్షిః శైవవిద్యావిశారదః ।

౭ ఆగతం చ ఋషిం దృష్ట్వా పూజాం చక్రతు రంజసా
తదా తుష్టో ఋషివరః పప్రచ్ఛ కుశలాదికమ్ ।

౮ వైశ్యో దీనం ముఖం కృత్వా ఉవాచ ఋషిసత్తమం
కృపాతిరేకేణ తవ సర్వ మస్తి గృహే మమ ॥
౯ సంతానం నాభిజానామి కృపాం కురు మహామునే
తతో ఋషివర స్తుష్టో జగాద మధురం వచః ॥
౧౦ ఉమామహేశ్వరం నామ వ్రత మస్తి సుశోభనం
తద్వ్రతాచరణేనైవ పుత్రాఽవాప్తి ర్భవిష్యతి ॥
౧౧ తతో వైశ్యస్తు సంతుష్ట ఆచర ద్వ్రత ముత్తమం
పుత్రం సర్వ గుణోపేతం లేభే నిఃస్వో ధనం యథా ॥
౧౨ తస్మా ద్భక్త్యా తు సర్వైశ్చ కర్తవ్యం వ్రతముత్తమం
ఇహలోకే సుఖంప్రాప్య చాంతే కైలాసమేతిచ ॥

తా॥ మహేశ్వరు డానతి నొసగు (ఆజ్ఞాపించు)చున్నాడు. ఓయీ! గౌతమమహర్షి! ఈవ్రతప్రభావ మెట్టిదనిన చిత్తగించుము. ఏను వచించుచున్నాడను, ఇట్టి యుమామహేశ్వరవ్రతమును యథావిధిగానాచరించి అష్టదిక్పాలకులు తమకు గావలసిన పదవుల నధిష్ఠించి అష్టైశ్వర్యంబుల ననుభవించుచున్నారు. మానవులు ఈవ్రతము ననుష్ఠించిన యెడల తమతమ యభీప్సితములను బడయుదురు, స్త్రీలకు సౌభాగ్యము గలుగును, తొల్లి ఒకానొకప్పుడు కుబేరు డీ వ్రతము నాచరించి నవనిధుల కధిపతియై మిగుల శివభక్తి గలవాడై సమస్తసుఖముల ననుభవించుచున్నాడు.

ఒకప్పుడు మగధదేశములో ధర్మగుప్తుడనే వైశ్యు డుండెను. ఆతని ధర్మపత్ని సురూపయను పేరుగలదై మిగుల గుణవంతురాలుగా నుండెను. ఆమెకు సంతానము లేక మనస్సులో నధికముగా చింతకు

లోనైవగచుచుండెను. తన జన్మ వ్యర్థమైనదిగా భావించుచుండెను.

ఇంతలో దధీచియను పేరుగల శైవధర్మరహస్యములను జక్కగా దెలిసిన ఋషీశ్వరుండు లోకంబులందు బర్యటించుచు ఈ దంపతులకు దర్శన మొసంగెను. ఇంతలో నాదంపతులు ఆ ఋషీశ్వరుని తమ కడకు రప్పించుకొని ఆదరపూర్వకాతిథ్యము లొసంగి భయభక్తులతోఁబూజించి, తమ విచారమును వెలిపుచ్చిరి, ఋషీశ్వరు డది విని, ఓ దంపతులారా! మీయీ విచారమునకు గారణమేమని ప్రశ్నింపగా నా దంపతు లాఋషీశ్వరునితో నిట్లు విన్నవించి; ఋషిపుంగవా! మాకు సర్వసంపదలు సమృద్ధిగా నున్నవి. సంతాన మొకటి లేని కారణమున మేము విచారగ్రస్తులమై యున్నాము.

దయాసముద్రుడైన యా ఋషిపుంగవుఁడు శివుని బ్రార్థించి యాదంపతులకు సంతానమును బడయుటకై యుమా మహేశ్వరవ్రతమును ఆచరించుడని ఆ వ్రతవిధానము వివరించి వెళ్ళిపోయెను. అప్పుడా వైశ్యదంపతులు ఒక శుభముహూర్తమున నావ్రతము నాచరించి, దరిద్రుడు నిధిని పొందినరీతిగా కులదీపకుడగు పుత్రరత్నమును బడసిరి.

కావున ఓ గౌతమమహాముని ఇట్టి పవిత్రమగు ఉమా మహేశ్వరవ్రతమును భక్తిప్రపత్తులుగలవారై ఆచరించినచో అట్టివారు ఇహలోకమున సమస్త సుఖముల ననుభవించి అంత్యసమయమున కైలాసప్రాప్తిగలిగి శాశ్వతానందము ననుభవింతురు. అని వచించెను.

౧ పురా లింగాంగసంబంధీ వణిక్ శ్రీ భద్రనామకః
సదాచారేణ సంయుక్తో లింగవ్రతపరాయణః ।

౨ మహేశ్వరే భక్తిపరో జంగమార్చనతత్పరః

ప్రత్యబ్దం శివ ముద్దిశ్య కుర్వన్ మాహేశ్వరం వ్రతం ।
౩ ఏకదా వ్రతచర్యాయా అంతే కార్యాకులో౽ భవత్
తదా ప్రసాదగ్రహణం నాసీ ద్భద్రస్య గౌతమ ॥
౪ రాత్రౌ కుక్షౌ మహాన్ శూలే జాయమానే రురోద హ
యత్కించిదపి సౌఖ్యంతు నావాప మునిపుంగవ ॥
౫ తతో రాత్ర్యాం వ్యతీతాయాం కించి న్నిద్రామవాప్తవాన్॥
స్వప్నే జంగమవేషేణ ఆవిరాసీ న్మహేశ్వరః.
౬ అరే భద్ర వ్రతస్యాంతే ప్రసాదం త్యక్తవానసి
ఏతద్వ్రతం చ త్వం కృత్వా ప్రసాదం ప్రాప్నుయాయది
౭ రోగజాలాని నిర్ముచ్య సుఖ మాప్స్యసి సువ్రత
ఇత్యుక్త్వా జగదీశోపి అంతర్ధాన మవాప హ ।
౮ భద్రోప్యు త్థాయ కల్యే తు వ్రతం కృత్వా విధానతః
ప్రసాదగ్రహణం క్రత్వా శర్మ లేభే యథావిధి ।
౯ తస్మా ద్వ్రతాద ప్యధికం ప్రసాద ఇతి మన్యతే
తదారభ్య ప్రసాదే తు శ్రద్ధాభక్తిసమన్వితః ।
౧౦ వ్రతం కుర్వన్ మహాభాగ ప్రసాదం ప్రాప భక్తితః
ఇహలోకసుఖం భుక్త్వా అంతే కైలాస మాప్తవాన్ ।
౧౧ తస్మాత్ ప్రసాదం భుంజీత ఉమామహేశ్వరస్య తు
సర్వాన్ కామా నవాప్యాథ అంతే శివపదం వ్రజేత్ ।
తా॥ పూర్వమొకప్పుడు భద్రుడను పేరు గల్గినట్టి శివాచార

సంపన్నుడైన భక్తుడు పరమేశ్వరునిపై పరమభక్తితో జంగమార్చనయం దాసక్తి గలిగి ప్రతియేట ఉమామహేశ్వరవ్రతమును నిర్వహించుచు బంధుమిత్రులకు భోజనం బిడి తృప్తిపరచినవాడై మహేశ్వరప్రసాదమును స్వీకరించుచుండెను. ఆ విధముగ నుండగ భద్రుడను ఆ శివభక్తు డొకానొకప్పుడు వ్రతమును నిర్వహించి కార్యాంతరములచేత మరచి ప్రసాదమును స్వీకరించకుండగనే వెళ్ళినందున ఉదరశూలమేర్పడి కడు బాధకు లోనై శోకించుచుండెను, వేకువజామున కొద్ది సమయము నిద్రపోగ ఆ సమయమున ఉమామహేశ్వరుడు జంగమరూపమున శివభక్తునకు దర్శన మొసంగి నీవు భక్తితో వ్రతము నాచరించియు తత్ప్రసాదమును స్వీకరించకుండ మరచివెళ్ళినందున నీకు ఉదరశూల మేర్పడినది. కనుక యథారీతిగా నీవు ఉమామహేశ్వరవ్రతమునాచరించి తత్ప్రసాదమును గ్రహించినయెడల నీ ఉదరశూలము తగ్గుననియాదేశించి యంతర్హితుడయ్యెను. తరువాత ఉదయమే నిద్రలేచి వ్రతము జరిపి బంధుమిత్రులతోబాటు తానుగూడ ప్రసాదమును స్వీకరించి రోగరహితుండై యిహమందు సమస్త సుఖముల ననుభవించి యంత్యసమయమున కైలాసమున కేగెను. కావున నీ ఉమామహేశ్వర వ్రతమునాచరించువారు తత్ప్రసాదమునందు భక్తియుక్తులై స్వీకరించవలెను. అట్టివారు ఇహపరసౌఖ్యముల ననుభవింతురు.

ఇట్లు చతుర్థాధ్యాయము సమాప్తము



## అథ పంచమాధ్యాయః

శ్లో॥ ఏకదా నైమిశారణ్యే కేచిద్గోపాలబాలకాః
ఉమామహేశ్వరాకారాం ప్రతిమా భక్తిసంయుతాః. ౧
శాండిల్యమూలే నిక్షిప్య పూజాద్రవ్యాణి చానయన్
గోధూమపిష్టచణకకదళీఫలమిశ్రితాన్। ౨
పదార్థాన్ భక్తితో దత్వా తతః స్థిత్వా ప్రమోదితాః ౩

తా॥ తొల్లి ఒకప్పుడు నైమిశారణ్యమునందు గొల్లబాలురు ఉమామహేశ్వరుల ప్రతిమలనొనర్చి బిల్వవృక్షమూలమున అర్చించి గోధుమపిండి (రవ్వ) శనగలు అరటిపండ్లు మున్నగునవి భక్తితో నైవేద్యముగా సమర్పించిరి.

శిరోంజలిపుటా భూత్వా ధ్యానతత్పరమానసాః ౩
కల్పోక్తేన ప్రకారేణ వ్రతం కృత్వా యథావిధి।
సుఖం ప్రాపు స్తదా గోపాః నాకా త్పూర్ణతరం సుఖమ్॥
రాజా కర్నాటభూపాలో తాన్ దృష్ట్వా భక్తితత్పరః॥
ప్రమోదసహితోఽ ప్యేవం ససైన్యబలసంయుతః ౫
తీర్థప్రసాదావగ్రాహ్య యయౌ స్వనగరం ప్రతి॥ ౬

తా॥ ఆ పిదప నమస్కరించి బద్ధాంజలులై శాస్త్రోక్తప్రకారముగా అట్టి ప్రభావముతో గూడిన ఉమామహేశ్వరవ్రతము నాచరించిరి. అదే సమయంబున అక్కడికి విచ్చేసిన కర్నాటకనృపతి బాలురొనర్చు పూజను దిలకించి సంతోషించి తీర్థప్రసాదములను స్వీకరించకయే తన పట్టణమునకు వెళ్ళిపోయెను.

పుత్రమిత్రకళత్రాది నష్టం రాజ్య మకంటకం ।
తేషాం గోపాలకోహ్యేకస్ తం దృష్ట్వాశ్చర్యమానసః
తత్సర్వం మనసా జ్ఞాత్వా బభాషే నృప మాదరాత్ ॥ ౭

తా॥ ఆ నృపతి తన భవనమునకు వెళ్ళి పోవగానే ఆతని దారపుత్రులు మిత్రులు సైన్యము రాజ్యమును వీడి వెళ్ళిరి. వ్రతమునాచరించిన గోపాలబాలురలో నొకడు ఒకదినమున ఆరాజుయొక్క రాజ్యము కళత్రపుత్ర పౌత్రమిత్రాదులు సైన్యము అతనిని వీడిపోవుటను గమనించి యాశ్చర్యపడి అందులకు కారణము దెలిసినవాడగుటచే వేగమే రాజువద్దకు వెళ్ళి యాతనికిట్లు చెప్పెను.

ఉమామహేశ్వరం నామ వ్రతం పూర్వం మయా కృతం
పూజాం దృష్ట్వా ప్రమాదాచ్చ త్వయోత్సృష్టం ప్రసాదకమ్
అతః కష్టం సమాసాద్య భ్రమస్యరణ్యభూతలే
తద్వ్రతం కురు నిశ్చిత్య రాజ్యం ప్రాప్స్యసి హేనృప ॥౮

తా॥ ఓరాజా! పూర్వ మొకప్పుడు నేను ఉమామహేశ్వరవ్రతము నొనర్చితిని. ఆది చూచియు మీరు తీర్థప్రసాదములను స్వీకరించక వెళ్ళితిరి, కనుక ఇప్పుడు మీకీయిడుము ఏర్పడినది. రాజ్యము విడిచి అరణ్యమున సంచరించవలసి వచ్చినది. కనుక ఓ మహీపతి ! మీ రీవ్రతమును తప్పక ఆచరింపుడు. అట్లొనర్చిననే నీరాజ్యము నీకు మరల సమకూరునని చెప్పెను.

నిశమ్య రాజ్ఞా తద్వాక్యం కృతం వై భక్తిసంయుతః
వ్రతం కృత్వా తదా లేభే రాజ్యం భార్యాం చ పుత్రకమ్

మాసే మాసే వ్రతం కృత్వా సర్వసౌభాగ్యసంయుతః

యాపయిత్వా బహూ న్వర్షా నంతే శివపదం యయౌ

తా॥ ఆ మీదట నా భూపతి గోపాలబాలుని వాక్యములను గ్రహించి యానందించి యనన్య భక్తితో నీ ఉమామహేశ్వరవ్రతము నాచరించి మరల యథారీతిగా రాజ్యమును దన భార్యను పుత్రులను, మిత్రులను బడసెను; శత్రువులను పరాభవించెను, నిర్విఘ్నముగా ఈతిబాధలు ప్రజలను బీడింపకుండ బహుకాలము రాజ్యమును పరిపాలించెను, దేహాంతమున శివసాన్నిధ్యమున కేగెను.

సూతేన శౌనకాదిభ్యో వ్రతం చేదం నివేదితం

నిశమ్య ఋషయ స్తత్ర వ్రతం చక్రుః ప్రమోదితాః ॥౦౦

తా॥ ఇట్లు సూతుడు శౌనకాదిమహర్షులకు ఈవ్రత మాహాత్మ్యమును బోధించగా వారందరు ఆనందించి యీ వ్రతమును వారును ఆచరించి కృతకృత్యులైరి. తమతమ కోరికలను బడసిరి.

ఇట్లు శ్రీస్కాందమహాపురాణాంతర్గత వ్రత ఖండమున శ్రీమదుమామహేశ్వర

వ్రతంబను పంచమాధ్యాయము సమాప్తము.

అథ

శ్రీ రేవణ సిద్ధ గురుస్తోత్రాణి

**: మంగళ నీరాజనము :**

బా బారో రేణుకా । ధీర ధరాతలకె బేగ బారో రేణుకా ॥పల్లి॥

వీరశైవరు భక్తిబాహ్యరు । అధర్మనిరతరు, అనీతిసహితరు

ధర్మబోధె ఇత్తు గురువె మతవ రక్షిసలు ॥౧॥
నీనాది గణేశా, సాక్షాత్ మహేశా, ఖలగజాంకుశా, మోక్షాంగనావశా॥౨॥
బ్రహ్మవిద్యాకోశ కలా కాశిచెరేశా ॥౩॥

## : బసవ స్తోత్రము :

బా బారో బసవా ! మాన్యమహీతలకె బేగ ॥పల్లవి॥
వీరశైవరు భక్తిభాగ్యరు । సద్ధర్మనిరతరు, సునీతిసహితరు,
ధర్మబోధె గానిజనిసి బారో ఇళయొళు ॥౧॥
నీనాదిసందేశా । ఆనమిత సందేశా ।
కుజనవినాశా । సుజనసుతోష ॥౨॥
భక్తిమార్గవన్నుతోరి । ముక్తమాడోనీ ॥౩॥

## : మంగళ నీరాజనము :

జయమంగళం, నిత్యశుభమంగళం ।
జయ జయతు శివ మహాంత లింగేశగె ॥పల్లి॥
ధరెయ భక్తరు మహేశ్వరరుగళపుత్రరిగె ।
శరణబసవాది ప్రమథర కందగె ।
పరశివనపార్వతియ తొడెయమేలాడుతల ।
హరుషాబ్ధి హెచ్చిసువ గురుపుత్రగె ॥౧॥
ఆకాశవను మోడ ముసికిదరు కెడదంతె ।
ఏకాగ్రచిత్తదలి మనవనితిసి ।
ంబేకుబేడెం బెరడు భవబీజగళనుహొందు ।
లోకదొళగిద్దు ఇల్లదమహిమగె ॥౨॥

హేగె మాళ్పరుహాగె సకల ఉపచారగళు
మంగలద శిశువాగి కైకొళుతలి ।
బంగారుకబ్బిణవ హిరికిరిదు సమగండు
లింగమహాంతేశ్వరా జగత్పుత్రగె ॥3॥ (జయమంగలం)

## 2 మంగళ నీరాజనము

జయతు గొల్లిళాఖ్యస్వామికి । జయతు శివానుభవచరమూర్తికి ।
సన్నుతించెడి భక్తవరులను । పన్నుగను బ్రోచెడిపరశివమూర్తి కీ ॥౧॥
అంగగుణములనెల్లను । లింగగుణములుగ మార్చితీవు
గురులింగ జంగమంబుల । గౌరవించెడు యతివరున కిపుడు ॥౨॥
భక్తి గలుగజేసి భక్తులకు । ముక్తిమార్గము జూపినట్టి ।
జోగిపేట పురమునందున । ఖ్యాతిగాంచిన పెద్ద మఠము కు ॥3॥
పెద్దవై రాజిల్లి నిరతము । దాసోహమొనర్చి పేరుగాంచియు ।
రాచవీరుని బ్రోవనెప్పుడు । రమ్యమగు యశము గూర్చుత ॥౪॥

వ్యాఖ్యారచయిత
పండిత్ పెద్దమఠము రాచవీరదేవర
"తీర్థ" & M.O.L.

## : నీరాజనము :

నీపాదపద్మములకు - నీరాజనంబు శంభో ॥ప॥ (నీపాద)
పాపౌఘములనుద్రుంచి - భక్తులను పాలించు ॥నీ॥
ధర్మగుప్త సురూపులను - దయతో బ్రోచి తనయు నొసంగిన ॥నీ॥
వైశ్యుడౌ ఆభద్రుబ్రోచి - వన్నెకెక్కివరలుచుండు ॥నీ॥
శ్రీలక్ష్మియైన సీతకు - చిన్న వరు శ్రీరాముగూర్చిన ॥నీ॥
మార్కండేయుని బ్రోచి - యమధర్మరాజు మదము నణచిన ॥నీ॥
త్రిపురాంతకాయ నీకును - గపురంపు హారతిదిగో ॥నీ॥
శ్రీయుమాదేవిగూడి - చెలువుగ చెలగియుండు ॥నీ॥
కైలాసవాసుడవై - కామితార్థము లొసగు ॥నీ॥
ఓగిరాలసుబ్బరాజు - ఊహలోన వెలుగుచుండెడు ॥నీ॥

## శాంతి పాఠము

(రచయిత : పి.ఆర్.వి. దేవర)

ఓం శాంతి, శాంతి, శాంతిరస్తు,
భువనశాంతి రాపఃశ్శాంతి
అగ్నిశాంతివాయుశాంతి ॥శాం॥ (ప)
వ్యోమశాంతి ఓషధయశాంతి,
ధేనుశాంతి మేఘశాంతి
సస్యశాంతి సతాంశాంతి ॥
ఆత్మశాంతి పరమాత్మశాంతి
సర్వజన మన శివశాంతి
శాంతి శాంతి శాంతిరస్తు

శ్లో॥ సర్వే భవంతు సుఖినః - సర్వే సంతు నిరామయాః ।
సర్వే భద్రాణి పశ్యంతు - మాకశ్చిత్ దుఃఖభాగ్భవేత్ ॥
"ఓం తత్సత్ - శివం భూయాత్"

## అనుబంధములు గ్రహదిక్కులు

| | | |
|---|---|---|
| రవి | మధ్యభాగమున | గోధుమలు |
| చం | ఆగ్నేయదిశ | బియ్యం |
| కు | దక్షిణపుదిశ | కందులు |
| బు | ఈశాన్యపుదిశ | పెసలు |
| గు | ఉత్తరదిశ | శనగలు |
| శు | పూర్వపుదిశ | బొబ్బర్లు |
| శ | పశ్చిమదిశ | నువ్వులు |
| రా | నైర్ఋతదిశ | మినుములు |
| కే | వాయవ్యపుదిశ | ఉలవలు |

## మంత్రపుష్పమ్

ఓం రాజాధిరాజాయ, ప్రసహ్యాసాహినే ।
నమో వయం వైశ్రవణాయ కుర్మహే ।
స మే కామా న్కామకామాయ మహ్యం ।
కామేశ్వరో వైశ్రవ ణోద దాతు ।
కుబేరాయ వైశ్రవణాయ । మహారాజాయ నమః .
ఓం తద్బ్రహ్మ । ఓం తద్వాయుః । ఓంతదాత్మా । ఓం తత్సత్యం । ఓం తత్సర్వం ।
ఓం తత్పురోర్నమః ॥
అంత శ్చరతి భూతేషు । గుహాయాం విశ్వమూర్తిషు ।
త్వం యజ్ఞ స్త్వం । వషట్కార స్త్వ మింద్రస్త్వగ్ం రుద్రస్త్వం విష్ణుస్త్వం
బ్రహ్మత్వం । ప్రజాపతిః
త్వం తదాప ఆపోజ్యోతీర సోమృతం । బ్రహ్మభూర్భువస్సురోమ్।
ఈశాన స్సర్వవిద్యానాం । ఈశ్వరస్సర్వభూతానాం ।
బ్రహ్మధిపతి ర్బ్రహ్మణోఽపతిర్బ్రహ్మశివోమే అస్తు । సదా శివోమ్ ।
సువర్ణదివ్య మంత్రపుష్పం ॥ సమర్పయామి ॥

# మహాన్యాస పూర్వక రుద్రాభిషేక విధి

ఇది బాలసర్వతీ బుక్ డిపోవారు ఆస్తిక ఆంధ్రమహాజనులకు హృదయపూర్వకంగా అందజేస్తున్న సరిక్రొత్త కానుక.

శ్రీ పాతూరి సీతారామాంజనేయులుగారు అందజేసిన పరిష్కరణతో - దీనిలో రుద్రదేవతాతత్త్వమూ, బోధాయనప్రోక్త మహన్యాసఖండమూలమూ - దానికి శాస్త్రీయమయిన తెలుగు వివరణమూ ప్రామాణికంగా ఈయబడి ఉన్నవి. ఇంతేకాక ఈ మహన్యాసంలో ఉండే న్యాసాలూ - వాని విభాగమూ - అందులో కానీ రుద్రాభిషేకంలోకానీ వినియోగం అయ్యే మంత్రాలూ -వాని తాత్త్వికమైన వినియోగమూ - సమగ్రంగా ఈయబడి ఉండడంచేత ఈ పుస్తకం స్వయంగా రుద్రాభిషేకం చేసుకొనే ఆస్తికులకూ పురోహితులకూ కూడా అన్ని విధాలా ఎంతో ఉపయోగకరం.


ప్ర కా శ కు లు :

**బాలసరస్వతీ బుక్ డిపో**

ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్ కర్నూలు - 518 001

టి. వెంకటేశ్వర్లు శెట్టి చేంబర్స్

నెం.4 సుంకురామ శెట్టివీధి, మద్రాసు - 600 001

సోల్ డిస్ట్రిబ్యూటర్స్

**టాగూరు పబ్లిషింగ్ హౌస్**

కాచీగూడా చౌరస్తా, హైదరాబాదు - 500 027.